ధాత్రిన్ ॥౬౫॥ తనవంతు వదుచు నెల్లెడ । దని రెండవ వదుచు నడగ సరినియ్యం గా । జిన బామాతులు డైనను । జినవు నగిప్పించవలదు సతులను వైశ్యుల్ ॥౬౬॥ క॥ మేనరికమునకు విఘ్నము । పూనిన వారలు నహోయము గా గొను వారల్ । మానక తోసిన వారల । హీనయగతి చేయవలయు దెలియగ నాజ్ఞల్ ॥ ౬౭ ॥ క॥ మెడబలిమి వంతువరుసలు । వడి గాం దప్పించినట్టి వైశ్యులు కడు పెం । బడి మేనరికం బియ్యని । చెడుగులు కుల బాహ్యులాజ్ఞ జేయగ నహుల్ ॥౬౮॥ క॥ మునుపు సుతులు లేకుండిన । నను వుగ మరియొక తె పెండ్లియాడిన సుతులన్ । గని నసవతాలియను జాలు । దనయుల మేనరిక మెసగ ధర్మము జెల్లున్ ॥౬౯॥ వ ॥ మరియు నవిస్తరంబుగాం జెప్పెద మువినుండు-వరుని కంటెంగన్య యఘుడియ తక్కువ యైజనియించినవి వాహంబు చేయ దగ్గంబు-కన్యక యున్నతంబును-వరుని వామనత్వంబును-జూడంగగదు -యిందుగాదని భుజవర్గంబునం ద్రొచిన రాజులమంచివల నంబో నాడిన-ధనమ సంబు చేత నైన-పశు-కృషి రత్నధన ధాన్యాందోళిక ఛత్ర చామర దంతి తురగ భూషణ చీనాంబర పుత్ర పౌత్ర మహదైశ్వర్యంబులంగన్నం గానక నైన మేనక ణంబు ద్రోసిన - వరులకిచ్చి ననితర కన్యకను పుచ్చుకొన్న కన్యక జనకునకు వరుని జనకుంపులంచంబు నొసంగి నన్మతిపడి యొసంగితిమనిన-వరుని జనకునకు కన్యక జనకుండు లంచంబిచ్చి యుభయము లేక మైతిసునికలపి మేనక ణంబు ద్రోసిన-కన్యకకు ప్రాణంబు లొంచిన-వరుండు రూపరి గాడని మేనరికంబ యిన సంస్మరింపదు నిల్లాని తావులని వాహంబు చేసిన-వంతు వరిశలు తప్పించి మేనరికంబు పుచ్చుకొన్న శకునంబు గాదని కన్యక స్వరూపి గాదని విడిచిన- నెవిధంబున నైన మేనరికంబు దప్పించిన పాపాత్ములకు గురుదూషకులకు-కులదూషకులకు-పితృమాతృ ద్రోహులకు నాజ్ఞ జేయందగు-నా యాజ్ఞా క్రమం బెట్లన్న వినుండు-బుతు త్రయంబు నాజ్ఞ యును- వెనక భాస్కరాచార్యులకు నగరము వారికిని కుల బాహ్యుండైనా శిష్టుండు పాష్టాంగదండ ప్రమాణంబు చేసి సవాపరాధతమ చేయవలయు నని ప్రార్థించిన వానికి ప్రతిక్రియ చెసె క్రమము-భాస్కరాచార్యులము

ద్ర బ్రాహ్మణుల వెంటగొనిపోయి-కాశీ-గయా ప్రయాగస్నానంబులాచరిం
పంజేసిపంచగవ్య ప్రాయశ్చిత్తంబు జేయింపవలయు - తత్క్రమంబెట్లన్న
మొదటిదివసంబుననువవసింపంజేసి గోమయాహారంబు జేయించినూలు గో
దానంబులలంకారసహితంబుగావిప్రులకొసంగి-సహస్ర బ్రాహ్మణభోజనం
బు చేయించియారాత్రి రామకథలువినుచు జాగరణంబు చేసి రెండవదివ
సంబునసంకల్ప యుక్తంబుగాగంగాస్నానంబుచేయించిపంచదశ గోదానం
బులలంకారపూర్వకంబుగా బ్రాహ్మణులకిప్పించిపంచశత బ్రాహ్మణభోజ
నంబు గావించి గోమూత్రంబాహారంబుగానారాత్రిశివ స్మరణచేయించి
జాగరణంబుండి-మూడవ దివసంబునగంగాస్నానంబు జేయించియిరువది
యైదు గోదానంబు లిన్నూటనేబండ్రు బ్రాహ్మణభోజనమును జేయించి
గోక్షీరంబాహారంబుగానారాత్రి భాగవత పురాణంబు వినుచు - జాగరణం
బుండి నాలవదివసంబున మృత్తికాస్నానంబు గావించి గోదానంబులిచ్చి బ్రా
హ్మణభోజనంబు చేయించి-తానును గోదధ్యాహారంబుగొని-పంచమదివసం
బున సర్వ ప్రాయశ్చిత్తంబు చేయించి సాలగ్రామంబులు దానంబులిప్పిం
చి బ్రాహ్మణభోజనంబు గావించి గోఘృతంబాహారంబుగాగొని నామసంకీ
ర్తనలచేజ్ఞానియైగురూపదేశంబున నారాత్రి జాగరణంబు చేయించియార
వదివసంబునపంచగవ్యస్నానంబును - ఉపవాసంబును జేయించి-పిష్టాహా
రంబుగొనిజాగరణంబు చేసి- యేడవదివసంబున గంధస్నానంబుచేయించి-
బ్రాహ్మణులకు శివలింగంబులు దానంబులు చేసి భస్మధారియైముద్గ భక్షణం
బు చేయించి శివపురాణంబు వినుచు జాగరణంబు చేసియష్టమదివసంబున గురు
ప్రార్థనమహాసంకల్పపూర్వకంబుగా పుష్పఫలజలస్నానంబులు చేయిం
చి బ్రాహ్మణభోజన శేషంబైనయన్నంబుగొని నారాత్రి రామచరిత్రంబు
లువినుచు జాగరణంబు చేసియారాత్రిగడపి మరునాడు గంగాస్నానంబులా
చరించి భాస్కరాచార్య మాత్రికుండైన బ్రాహ్మణునితో గదలి స్వగ్రా
మంబు ప్రవేశించి భాస్కరాచార్యులయిన కులస్వాములకు దండంబులాచ

రించి వారియనుమతినగరేశ్వరజనార్దనవింధ్యవాసినికోనకమల వాసవ కన్యకాబాలనగరంబులకుమహోత్సవంబులుగావించినగరేశ్వరునకుపం డ్రెండుమణువులకంచునభాస్కరాచార్యులకుగుగుదక్షిణ గోదానంబులి రునైదును బ్రాహ్మణభోజనమును చేయించిపలస్వాములకుభోజనంబులు చే యించిగురువులయనుమతిలవణంబునుదధియును తానువడ్డించి వారల యను మతి శంఖభోజనంబుచేసిగురువులచేగంధాక్షతతాంబూలంబులం జేకొని సభకుఁబ్ర దక్షిణదండంబులాచరించి వారియనుమతి సుఖం బుండవలయుని ట్లు మేనరికంబుతప్పించినవారికిని-తప్పనవారికినియీవిధంబున నాజ్ఞనడిపిం పసివైశ్యులునిర్మలులైలోకాపకారులైయుండురసిచెప్పెమరియును॥౭౦॥

సీ॥ముదమునవరునిదిమొదటిగోత్రంబునుగన్యకతండ్రిసీఁగన్న తల్లి।పుట్టింటి వారిదిపొందుగామూడోదితనరంగుగూడినచునుమరాలు। బాలకిజనయిత్రి మూలగోత్రంబును బాలునిమూడోదిలీలతల్లియాను వారిద్దరలదిప్పన్న వానిది రెండోదిపడుచది ప్రేమమూట। బెరశిమరియొక్కటైననుబిడ్డవాని।కూతు వాలిక్షిరెండోదికోకేళాలలర।కొడుకువారిది రెండోదిమామిమీర। వేకము గు నేనియీవారియత్తయగును॥౭౧॥గీ॥ రెంటమూడింటగోత్రంబులేక మైన। ప్రవరమైననుబంధులప్రవరమైన।వరునతోడుతఁజేయంగవాపికాదు।కన్య నీకున్నమిగులబుణ్యంబుగలదు॥౭౨॥గీ॥ పితృగోత్రంబుమిగులను బెంపు మీర।జేయరాదంద్రుమిగులసంశ్రయముతోడ।కన్యగోత్రంబుమిగులను క్రమముతోడఁ। బురుషగోత్రంబుమూడోదిపొందియున్న। మిథునసమ్మతి మొదలను మేలుచేయు ॥౭౩॥గీ॥ పిన్నవానిక్షిరెండోదిపిన్నపడుచు। వారిగో త్రంబు మొదటిదివరుసతోడ।మరదలగుఁబెండ్లికొడుకునకరయనదియుఁ। గు తుకమునకిట్టునెట్టెంగోడలగును॥౭౪॥వ॥మరియుకులాచారధర్మంబుల నే కంబులుగలవు-ఋతుకాలపద్ధతియు-గర్భాదానాదిషోడశకర్మంబులును-యజనాదికర్మత్రయంబును-కృషివాణిజ్యగోరక్షణవృద్ధిజీవనంబులును-సప్త సంతానధర్మవిశేషంబులును మొదలుగాగల వైశ్యకులధర్మంబులుసమస్తం

బునుం జెలియ జెప్పి యనంతరంబ భాస్కరాచార్యులనవలోకించి వైశ్యు లి
ట్లనిరి॥ ౪౫॥ ఉ॥ మీరు మహానుభావులు। సమిద్ధవచోవిభవాభిరాములిం। పార
గ వైశ్యవంశమును మహోన్నతవృద్ధి యొనర్పఁ దీవనల్। ధీరత నిచ్చి గోత్రశతదీక్ష
యశస్స్థితిశీలమూలమై। వీరతలుల్లసిల్లఁగ కవిత్వకృతిం గృతి సేయు టొప్పగున్॥
౪౬ ॥ క ॥ మునుమా పెద్దల చరితము। మునిసాళ్వం కాయనుండు ముదమున జె
ప్పెన్। ఘనముగ తత్కృతి పొందుగ। ననుగుణమై చేసి చెప్పుడాంధ్రోక్తిద
గన్॥ ౪౭ ॥ వ ॥ అని చెప్పి తదనంతరంబ భాస్కరాచార్యులకు సబహుమానంబుగా
కర్పూర తాంబూలంబొసంగి తమకుం గలసమస్తధనంబులు భాలనగరంబుల
కొక్కభాగంబును దేవతాగారంబులకు తటాకంబులకొక్కభాగంబును వి
ద్వజ్జనకవిగాయకజనంబులకు నౌచిత్యంగా నొక్కభాగంబు నొసంగి యి
వ్విధంబున నెప్పటియట్ల నడపుండని భాలనగరంబులకొప్పగించి భాస్కరా
చార్యులకు జాహ్నవీతీరంబున దామరవాడయను గ్రామంబగ్రహారంబుగా
నిండుండని చెప్పి పెనుగొండలోన ధనాంశంబు తత్పురదేవతామహోత్స
వంబునకొసంగి మిగిలినయర్థంబు కులగురువులైన పండితవర్గంబులకిచ్చి ని
పురమధ్యంబున శాసనస్తంభంబు నిలిపి. భాస్కరాచార్యులకు తా ప్రదాన
శాసనపత్రికి లిఖియింపం జేసిరి తత్క్రమం బెట్టిదనిన ॥ శ్లో॥ స్వస్తి శ్రీ సగరే
శకోనకమలా శ్రీ బంధ్య వాసీ జయా । శ్రీవత్సాంక జనార్దనశ్చ సువిశో వి
ష్ణుశ్వర శ్రీనిధిః సూర్యేంద్వారబుధేజ్యశుక్రరవిజస్వర్భానవః కేతవస్సా
న్నిధ్యం పెనుగొండపట్టణవరే కుర్వంతు దీర్ఘాయుషః ॥ కల్యాద్వ్యబ్దగణే
ష్టనేత్రరసదృక్సంఖ్యాగతే వత్సరే ప్రాప్తేబ్ధః ప్రభవే తవస్మపిసతేష్వద్వితి
య్యాంగుతా । ఆర్యా భాస్కరపండితాదిధరణీబృందారకేభ్యస్సదా ప్రీ
త్యాష్టాదశపట్టణాధిపతిభిర్దత్తం శుభం శాసనం ॥ గృహేగృహే విశాంవ
షేవపష్ఠే ద్వాదశగోత్రిణాం । వివాహేచ వివాహేచ శ్రీసుత్రీమంతక
మణిః॥ పుత్రేపుత్రే తదుత్పన్నే కన్యాయాం జన్మజన్మని । గద్యాణకం తద
ర్ధం చ గద్యపద్యాదినక్రియా॥ శాంతికే పౌష్టికే చైవ షష్ఠే త్రైకే వృద్ధికర్మ

శ్లో॥ అన్యస్మిన్ పుణ్యకాలేచ గ్రహణేచంద్రసూర్యయోః॥ లక్ష్మీనారాయ
ణానంత వ్రతాదిషుసమంతతః।గోత్రప్రవరవిజ్ఞానేషులసివాహక్రి
యా॥ప్రతిజ్ఞేషాంకృశాంవైశ్యస్తప్మాత్పండితఆశ్రయః। యథాకాలంయ
థావిత్తంయథాదేశంతథాచరేత్। విత్తశాఠ్యంనకుర్వీతఃఫలేఫలకాంక్షి
భిః॥అకృత్వాసత్క్రియాంమూఢోనరకేపరిపచ్యతే॥పురాణోక్తప్రకారేణ
కృతవాన్ధర్మచింతయా. ఆయురారోగ్యమైశ్వర్యంపుత్రపౌత్రప్రవర్ధ
నం।ఐహికాముష్మికంచైవలభతేనాత్రసంశయః॥ పూర్వాత్రికాన్పరిత్య
జ్యసమీపస్థాన్కులాగతాన్॥ యోదదార్యస్యపిప్రేభ్యస్తద్దానంనిష్ఫలం
భవేత్। ఇత్యుక్త్వాతేపికాన్ప్వస్వపుత్రాన్ధర్మపరాయణాన్॥భాస్క
రాచార్యపూర్వేభ్యఃప్రదద్యుర్ధర్మశాసనం। కులోద్ధరణచారిత్రాన్
బ్రాహ్మణాన్శృణుయాత్సుధీః॥ పాషండాఃపతితాష్మాద్రామద్యపా
స్త్వంత్యజాదిభిః।నశ్రోతవ్యంకదాప్మాకంతేభ్యోదానంచదాపయేత్॥స్వద
త్తాద్ద్విగుణంపుణ్యంపరదత్తానుపాలనం। పరదత్తాపహారేణస్వదత్తంనిష్ఫ
లంభవేత్॥*॥సీ॥ముద్దమొప్పఁగల్యాణమున నైదుపిండులు వేషారనొక్కొ
క్క పెద్దమాడ। వరుసనీమంతోత్సవమున సువరహానితనయుండుగల్గ ప్రతా
పమరయు।పుత్రికెజనియిం.ప పోలుపారధరణంబుప్రథమాత్రవంబున వరగ
చపివె। ప్రతిష్ఠిత్యకార్యదైవతమహోత్సవమ్ములఁగర్తలుమీరెపఖ్యాత
మునను(గుట్టిగావతనలుదప్పినట్టివారు।ఘోరరౌరవనరకాలఁగూడిమునిగి।
పెక్కువర్షంబు లెంతయుఁబెంపుచెఱచుఁ। బుధమిబహుపాదకంబుల
బొందువారు॥సీ॥ భాస్కరపండిత ప్రముఖసంఘముతోడ వినుడంచువైశ్యా
లిట్లనిరికురియు। మావంశచరితంబుమహిలోన వెలయించిపుత్రులకీకనఁ
బొందఁజేసె। పితృదేవతోత్స వవ్రతశుభంబులయందువర్తనల్ గైకొనిక
ర్తలగుచు।యెవ్వరినర్థింపకేట్టేటదప్పక గురుపూజఁజేయించుకొనుచు నా
జ్ఞ।సీమలను నెల్లవెలయుసుశ్రీలతోడ। బాలనగరాలదీపించి ప్రబలగోరి।ప్ర
ఖర లెఱుగించికల్యాణపరులఁజేసె।ధాత్రి వెలయుంచుఁడాచంద్రతారకముగ॥

౯౦ ॥ వ॥ అని యివ్విధంబున శాసనంబు లిచ్చి బాలనగరంబులం జూచి యిట్లని
రయ్యా మీరలీ గురుభాస్కరాచార్యుల ననుదినంబునఁ బూజించుచు వీరల
యాజ్ఞానుసరణంబున నడవఁగలవారలని చెప్పి యనంతరంబ నగరవరులఁ జూచి
మీరలీ నగరేశ్వరదేవాలయంబునకుఁ బడమర మిట్టపల్లంబు లేని సమస్థలం
బున గుండంబు లాయత్తంబులు చేయుండని పలికిన భయంబంది మెల్లనె చేరి వై
శ్యుల పాదంబులు బట్టుకొని దండంబులిడి యిట్లని విన్నవించిరి ॥ ౯౧ ॥ గీ॥ మీరుఁ
జెంప పెరిగి మీ పాదపద్మంబు ॥ లనుదినంబుఁ గొలిచి యధికమహిత ॥ బొందలియం
క మీరు బోసఁగి మూర్తి నేఁగ ॥ నిచటనుండ నొల్ల మెంతయైన ॥ ౯౨ ॥ వ॥ అనియు సే
క విధంబుల విన్నపంబులు చేసుకొని వారల యనుమతి వడసి వెంట జనుటకై వీర
కంకణంబులు ధరియించి గుండంబులు ద్రొవ్వి యలంకరింపఁ జేసిరి ॥ ౯౩ ॥ సీ॥
పన్నీరు గుజిలి కీనవద నైన జవ్వాదిఁ గలిపిన మృగనాభి కర్దమంబు ॥ కలయంగఁ జలికి
నాఁగమని యాస్యమై మించు కుండంబులో మేటికొమరు మిగుల ॥ నత్యాశ్వ సంధు
లఁ దద్దయు మేరుగా విపుథమౌక్తిక రత్నవితతి దనర ॥ రంగవల్లుల దీర్చి శృం
గారబంగుల పటుతర స్ఫురణలు వరిఢవిల్ల ॥ గంధసార ద్రుమంబులు ఘనత మె
రయ ॥ గుండములు నిండఁ బేరఁ బుచు దండి మిగుల ॥ జల్లి కర్పూర తైలంబు చతురగ
తుల ॥ గప్పి గంతటక పూరణగ మొప్ప మిగుల ॥ ౯౪ ॥ వ॥ ఇవ్విధంబున నలంకరించు
చు నానాచిత్రవిలాసంబుల లరు మహోన్నతంబులగు నమకంబులు ముప్పూరిగొ
న చిత్రవస్త్ర తోరణ రంభాస్తంభ గుచ్ఛ దీపనీవారంబుల నొప్పం జేసి రాసమ
యంబున వైశ్యులు తమ కులాంగనలం గని యిట్లనిరి ॥ ౯౫ ॥ క॥ వాసవకన్యాస
హితముగా సరభసవృత్తి మీరు ఘనశృంగారో ॥ ల్లాసితలై యుండుడు సం ॥
త్రాసానల కీలలకును డాకొనవలయును ॥ ౯౬ ॥ వ॥ అని సాధ్వీసముదయం
బులకుం జెప్పి తదనంతరంబ వైశ్యవరులు వీరవ్రతంబులు ధరియించి పగ మో
త్సాహంబు ననిట్లనిరి ॥ ౯౭ ॥ చ॥ మనమతి ధైర్యవంతుల ము మానక మానక రో
రవీరత ॥ జనులు నుతింపఁ బూని తిమి సాహస వైఖరిఁ జెప్పఁ జిత్రమై ॥ కనలె
డు నగ్నిగుండములఁ గ్రక్కున వచ్చి యనువ్రజంబులౌ ॥ దనరిశి వార్చుణంబ

పుచుఁ దగ్ధయ్యెం బొందిన సాహసక్రియన్ ॥౯౮॥ శా॥ నీ వే నెబ్బంగి కలంచు నూన యగతిన్ వీక్షించి యువ్వాసవిన్ మానమౌర్గ గజూనొరడించి తలపుల్ నానావ చోయుక్తులన్ నపరన్ నాగసి నేపుల్ బెంపున మహా ధైర్య ప్రభావస్థితుల్। ఘ నమౌ దృష్టమా సంఘటించవలయున్ గైవల్యసంసిద్ధికిన్ ॥౯౯॥ వ॥ అని మరియు నె ఱుంగఁగఁటిని గాక యవ్వాసవి చిత్తంబు నుమతి సాహసక్రియ యనుమున మెఱుంగుదు మెక దా-యిది యప్పుడు మధుర వాక్యంబు లనునానయించ మని కుసుమాఖ్యగృహంబు వకనిచి బాలనగరంబులం జూచి పురంబులశృంగారంబు సేయించుండనిన వారలుత్సాహంబు॥౧౦౦॥ గీ॥ పురము వేడ్కనలంకారము లుదన పఁ। దమ చతుర్ముఖున త్యా దరముగ మెరయగ। సకలవస్తువితానము సం గతముగ। జేయుచుండిరి విమలసుశ్రీలు జెలఁగ ॥ ౧౦౧॥ వ॥ అంత కుసుమా ఖ్యుం డుం జమందిరంబునకుం జని నిజపుత్త్రియైన వాసవి నాలోకించి యిట్లని వి లపించం దొడంగె ॥౧౦౨॥ శా॥ నీ రూపంబు ను నీ మనంచితనముల్ నీ నేపుల్ నీ మున్దుముల్। నీ గమ్యంబు రాజహంసగతియున్ నీ రాజబింబాస్యముల్। నీర త్నావళీహారశోభిగళమున్ నీ చందనామోదంబునిం। కేరినిన్ మనువంగవచ్చు జెపుమా నో తాత్వికో వాసవీ॥౧౦౩॥ సీ॥ పాండవవంశ సంభవుఁడగు విష్ణువ ర్ధనుం డేలధాత్రికి దండు వెడలె। విశత్రులఁ బరిమార్చి విజయంబు గైకొని లీల తో మనపురి కేలవచ్చె। వచ్చినపుడు మేలవగుస తోసతనికి సొడ నూపితె మిపరి స్ఫురణ మెకయు। మనతోడఁ గూడ సన్మకలీలతో వచ్చె నీ కన్య మున్న తఁ జేల జూచె। జూచి మోహనలీలల సొబగు మీరి। యేలకల్యాణముగఁ గోరియుచ్చె ను బ్బె। యింతయను విధివశము గాకింత వట్టు। మనల బ్రేఁచు మరితకర్మంబు క తన॥౧౦౪॥ చ॥ సుగత సుప్రకాశమానములు సద్విజకోటికి నిచ్చు నూన్నతిమ్రొక్కము లొనర్చి ధర్మముల వారణలీల ఘటించ జేసితి। స్వత బహుభోగసంపదలఁ జా లఁగ గైకొని నిన్ను బెంచి। జతురతఁ గంటినో సరసిజాక్షి విలోచన వాసవాంగన అని పలికి॥౧౦౫॥ క॥ అప్పుడు శోభకరంబులు। కుప్పరిగొనకుసుమశెట్టి మోహా పుపుత్త్రిన్। దప్పక జూచి కలంగుచు। నప్పంకజగర్భుఁడు రైనకటా యనుచున్ ॥ ౧౦౬॥ సీ॥ కన్యా నాయుతిశీణ గామ్య ముత్తములంబున పుట్టించదగునె యంభోజగర్భ!

బాలాలలామకు భర్తృహత్య మాఁగాఁగఁ గావింపఁదగు నెహో కాలకంఠపుత్రి
కారత్నంబు భోగభాగ్యశ్రీల బాపంగదగు నెహో పద్మనాభ। యీపుష్పకోమ
లి నెల్లనిదయుఁడ వైపాపహుఁడఁ గొని మోదుయగ్నిహోత్ర। దేవతతులా
రరవిసుధాధాములార। యక్షపన్నగఖేచరాఢ్యతతులార। మానివరులార
భూనభోమాన్యులార। దయదలంపక నిటు చేయదగునె మీకు॥౧౦౮॥ వ॥ అని పె
క్కువిధంబుల నక్కోమలగర్భముఖ్యులం దూరి శోకవిహ్వలహృదయుండగు
చు యక్కన్యామణిరూపంబు తనమదిం దలపోయుచు మూర్ఛిల్లి యొక్కొం
త సేపునకు సేదదేరి తనకెదురుగా నే తెంచిన యక్కన్యారత్నంబు నెత్తుకొని
కూర్చుండి తనతొడలపైనిడిగొని తేరిజూడఁ జాలక చూచిన యెడ దృష్టిదాకు
నో యని కలంగుచు సలు కురుతల నిమురుచు నెట్టకేలకు కన్యామణి విన నిట్లని మొ
౧౦౯ శా॥ శ్రీవాసవి వాసవాఁగనమహోధైర్యప్రతాపాఢ్య సఁ। ఫుల్లాంభో
జవికాసితాస్య నిను నాపూర్వాదిభాగ్యంబునన్। దెల్లాకైమఖంబునన్ సుకృ
తినై తేజంబునఁ గాంచితిన్। ముల్లోకంబుఁ గీర్తించు నం ధితిజనుల్ మోదంబు
నన్ జెంపశాక్॥౧౧౦॥ క॥ నగరంబునగల వార్తలు। నగరస్వాములఁ బ్రతిజ్ఞనా
నావిధముల్। దెగిన నృపాలుని పలుకు। నగణితముగ యరుసదస్సు యంభో
జముఖీ॥౧౧౨॥ క॥ మన మేమి దలపుచుండగ। దనరారగ దైవ మేమి దలచునొ
పికవక్। మనుజాధిపుఁడిబ్బ్విధమునఁ। గొనకొని యీన్యాయకార్య గోచరుడ
వ్యాకా॥౧౧౩॥ ఉ॥ కన్నది పట్టి దిత్తుమని నిర్దయవృత్తి నృపాలసద్భటుల్। వ
న్నగవచ్చినారు కులపావని వాసవినీ మనంబునన్। విన్న దనంబునొందక వి
వేకము పొందు నధీర దిత్తులై। సన్నుతఁ గీర్తినొందవలె సమ్మతి నొక్కతలంపు
సెప్పెదన్॥౧౧౪॥ వ॥ అనుచు నక్కుసుమవిభుండు దుఃఖార్ణవంబున మునింగి
హృదయంబునఁ దలంచి॥౧౧౫॥ గీ॥ తప్పు లేక కలుగుచ న్ననుద్యోగించుఁ। దైవ
నేటికనుచు జెప్పకుండు। చెప్పకున్న బాలచిత్తమెట్లుండునో। జెప్పవలయునను
చుఁ జెప్పదొడఁగె॥౧౧౬॥ సీ॥ విష్ణువర్ధనుఁడను పృథ్వీశ తలేంద్రుల నెల్లనని గె
ల్చి మనవీటికిఁ దఁడు వచ్చి। నిన్ను నిమ్మని పట్టి నిగ్రహింపను హా గ్రబహువి

థంబులఁ గుమ్మరిఁ బాఁతఁ జేయ। మానంబు దాఁటించి మనకులస్వాములు ప్రాణంబు విడిచైన ప్రతిభ దనర। నంశ సత్కీర్తులు వసుధలో నెగడంగ నగ్ని ప్రవేశంబు లధిగ జేసి। ముక్తి బొందఁ దలంచిరి మేలు వనులర।. నీసహాయంబపేక్షించి నిత్యపదము। గెలుసు నట్లనికులము వారలు దలంచి। పలుకుమని నన్ను బంచిరి వలుకు వెల్ల॥౧౧౭॥ వ॥ అని సుమహాభుజ డరిపడఁ బలికిన విని యాతఁ సాధ్వి యైన కుసుమగంధి శోకపరవశ యై మూర్ఛిల్లి కొంతదడవునకు సేదదేరి తన ముద్దుకూతు నెత్తికోని పురపురం బొక్కుచు గద్గద స్వరంబున నిట్లనియె॥౧౧౮॥ ఉ॥ నోములు సద్వ్రతంబులును నూతన భంగి నొనర్చి భామినీ। స్తోమము మెచ్చ మాసములు దొమ్మిది మోసి టు నిన్నుఁ బుత్రిగా। నే కుమతోడఁ గాంచితి నినీరజలోచన మమ్ము డించితీ। వేగని యగ్ని కాహుతిగ నే గెడు మా కెరుగంగ జెప్పవమ్మ॥౧౧౯॥

క॥ నినుఁ గొమపఁ గిడి కంటిని। వనజారికళావతంస వరము నీవుగా। తనయా సౌభాగ్యంబున। జనియించితి నిన్ను సకల జనులు నుతింపన్॥౨౦॥ సీ॥ పైడిగిన్నెలలోన పాలు నెయ్యు న బోసి పంచదార యొకింత మించ వేసి। బహువిధంబులఁ జోలఁ బాడుచుఁ దాగింతు నీముద్దుబలుకుల నేపు మెరసి। పంచు నెయ్యముతోడ పీనుల కింపు గాఁగల నీచరిత్రలు కలికిమతులు। వీక్షించి హృదయారవిందంబులోపల నానంద మొందుచు నద్భుతముగ। నెట్లు నిన్ను నగ్ని కీలల నేరయ ధాత్రి। యందు నొప్పింతు నక్కటా హరిపిరించి। ముఖ్యులేటికి దెలియరో ముగ్ధ నీదు। హృదుల భావంబుఁ దలపోసి మదిని వగతు॥౨౧॥ గీ॥ పుత్రకామేష్టిఁ జేసి శంభుని గురించి। తనయగాఁగంటి నిన్ను వృద్ధాప్యమునను। యకటనీ మేలు చూడ లేదయ్యెఁ బిడప నట్టి సంతోష మెక్క డనన గె జెప్పుమా॥౨౨॥ వ॥ అని యిట్లు పరమ దుఃఖితులై యున్న తల్లిదండ్రులం జూచి వాసవకన్యకా సహోదరుండైన విరూపాక్షుం డిట్లనియె॥౨౩॥ సీ॥ ప్రియము రెట్టింపంగ బెంచితి రిన్నాళ్లు మాతనన్నెట్లు నేమరతు నమ్మ। నిఖిలవిద్య లెరుంగ నేర్పినతండ్రి వికసు వేడ్కనిన్నెట్లు విడుతు నయ్య। నభివాంఛితమ్ములిమ్మని యొడ చెలియలనింక నే నెవ్వరికి త్తునమ్మ। వేడ్కతో నను గారవించు బంధువులా

రవంతతో నెట్లు వేగింతునయ్యా । ననుచుబలుకారు వేవేఁ రనాత్మఁదలఁచుచు
సతతంబైనదుఃఖాబ్ధి మునిఁగి లేచి । వేయు భంగుల బాఁబలవింపదోఁడి గొ । నంతనం
తకునాఁకరూపాతుఁడేలమి ॥ ౨౨౪ ॥ వ ॥ అనంతరంబకుసుమాఖ్యుండు
సూతుఁగనుంగొనియ నేకవిధంబులదుఃఖించి గద్గదకంఠుండై సురియునిట్లనియె
౨౨౫ ॥ మ ॥ అనలజ్వాలలజొచ్చునప్పుడుమహాహంకారమేపారగా । జనుల
త్యద్భుతభంగిఁజూడఁగణకన్యాసంగంభజృంభాత్ములై । ఘనభక్తిన్మదిశంక
రుం దలపుచుం గారుణ్యభావంబునన్ । మనవైశ్యాన్వయమెల్లఁబావనము
గామన్నించిరక్షింపుమీ ॥ ౨౨౬ ॥ క ॥ నీవలననుమనవంశము । ధీనుతంబై ధ
రిత్రిఁ జేజంబెసగన్ । పావకశిఖలతిభీకరభావంబులుగాఁగఁజూచి యమ్మంప
తుమీ ॥ ౨౨౭ ॥ వ ॥ అనుచు ననేకవిధంబులబోధింపుచు శోకవివశుండై యుం
డెనంతకుసుమగంధియు దుఃఖార్ణవమగ్నరాలై యుండెనయ్యవసరంబునఁ
దల్లిదండ్రులును సహోదరబంధుజనులంజూచి యూరడించుచు వాసవియి
ట్లనియె ॥ ౨౨౮ ॥ శా ॥ ఏలా యజ్ఞులరీతిమూఢమతులై యిబ్భంగి శోకింపు
చున్ । జాలింబొందకుడింక నన్నుఁగణకన్యాసంరంభజృంభాత్ముఁడై । బాలన్
నన్గ్రహించఁబట్టి తెండనుచు నృపున్ వైశ్యానరాభీలమై । కాలోగ్రంబగుశాపఖడ్గ
మున నేఖండింతుఁదత్కంఠమున్ ॥ ౨౨౯ ॥ ఉ ॥ మీకు విచారమేల బలిమిం జన
నాథుని భృత్యులుగ్రులై । చేకొనివట్టవచ్చినఁ ప్రసిద్ధమున ప్రతిభాగ్ని వీథుల ।
స్తోకగతిన్ దనవర్ణభయదుస్సహశాపమహావిజృంభణన్ * లోకములెల్లమె
చ్చభటలోకమునుగ్రతభస్మమే చేసెదన్ ॥ ౨౩౦ ॥ చ ॥ జ్వలదనలోగ్రకుం
డమునఁ జన్యాసజొచ్చియు సువ్రజంబులన్ । వెలయశివార్పణంబనుచు ప్రశ్రు
తభక్తినొసంగిన శంభుని । గొలిచి వనిత [illegible] లంబుఁ దగసంభినియుండఁ పావ
నంబుగా । వలరగమీకుఁబుణ్యగతులచ్చుగనిచ్చిన మెచ్చరాదుగో ॥ ౨౩౧ ॥
చ ॥ వగపున కేమి కారణము వైశ్యులనాథలటంచుఁ గ్రొవ్వునన్ । వగగొనఁభూత
లాధిపుఁడు పాపము చేసిన నెవ్వఁ గడ్డమా । జగతిని చావులేని మనుజప్రజయుం
గలదే వశిష్ఠులలబగణింపఁగీర్తినొందు మృత్యులచ్చుగనిచ్చెద మంఖమేటికో

౨౩౨॥ క॥ ఏమియు నెఱుఁగని మూఢత * నే మఱి సంసారదుఃఖ మేలా త్రవ్వగా।
భూమిని నీ మును చనువారలు * నేమంబున జగతినుండ నేరరె చెపుమా ॥ ౨౩౩
గీ॥ తేజ మొనరించి సుజ్ఞానదీపలక్ష్మి * చేత నజ్ఞానతిమిరంబు చెండి వైచి * శ్రీ
మహాదేవు కైలాసశిఖరివాసు * నెలమి మెప్పించి దిగ్గై కొందు నిష్టసిద్ధి ॥ ౨౩౪
చ॥ నలపురుకుత్సచంద్రసుతనందనరంతిగయాంబరీషరా * ములు శిబింకు
పక్షిరథముఖ్యధరాతలనాథు లోలి దో * ర్బలయుతులై మహీతలము పాల
నఁ జేసిరి గాక కాలము * గెలువఁగ శక్తులై రె మఱి ఖేదము బొందకు తండ్రి
యొంతయును ॥ ౨౩౫॥ వ॥ అనుచు ననేకవిధంబులయిన వాసవకన్యాలలా
మంబు పూర్వకథావిశేషంబులయిన జ్ఞానవైరాగ్యంబు లుపదేశింపుచుండె
నంతనచ్చాలనగంబులు పురంబు సముచ్ఛటవటులవీరాలాపంబును నానాదేవ
తామందిరద్వారపంచమహావాద్యనాదఘుమఘుమాయమానంబు సువివిధ
మణిగణప్రయత్న కనకధ్వజముక్తాఫలఛత్రచామరదివ్యాంబరవితానవి
రాజితంబును బుణ్యాపణ్యవీధికాంగణప్రయత్నకస్తూరికాజలసంప్రోక్షిత
మణిరంగవల్లికావేల్లితంబును ఘుమఘుమను ధాధౌతశాతకుంభప్రభాభగద్ధగిత
భూనభఃకకుబంతంబును సతాశివధ్యాననిష్ఠాగరిష్ఠవీరమాహేశ్వరసంకులం
బును నై కైలాసంబునుం బోలె మెఱుంగులం బొలిచిన కీర్తి త్రైకైశ్వర్యంబగు న య్య
వసరంబున ॥ క॥ లలనలు వాసవకన్యా। నిలయమునను నేను దెంచిని యమవ్రత
లై * జెలగుచు పరమానందం * బులు మెరయఁగ వెలయ సద్విభూష్యను దక్తిఁ ॥
సీ॥ మగువలు పన్నీట మజ్జనంబులు దీర్చి కమనీయ్యజితాంశుకములు గట్టి। క
స్తూరిజవ్వాది కలపముల్ మై బూసి ఫాలస్థలంబున బాగు మెరయ। తిలకంబు
లొగి దీర్చి దివ్యభూషణములు కుచునొప్పమీరసంగమున దాల్చి। చెంగల్వ రే
కులు జేమంతిపువ్వులు జడలందు కొప్పున సంతరించి। తమ్ములమ్ములు చేయుచు ద
ర్పణములు। నుండిఫలములు పాణిపద్మముల మెరయ। సుడిశి బహువిధగంధ
ముల్ సోడుముట్ట। వాసవాంగనయింటికి వచ్చిరపుడు॥ యిట్లు వచ్చిన ౨౩౬ క॥
కుసుమాంబసంభ్రమంబున। కుసుమసుగంధులను జూచి కోరికె మెలి కెఱ। పౌస

గగవాసవకన్యను రసికత గైజేసి తెండు రాజసలీలన్ ॥౨౯౭॥ క॥ అని చెప్పి
ననొగాకని నను రాగముతోడ నప్పుడంగన లెల్లన్ । వినయమున కన్యకామణి
నెనయఁగ గైసేయఁబూని రింపులు మీరన్ ॥౨౯౮॥ క॥ సంపంగినూనె శిరమున ।
సొంపున కలయంగ నంటి జొబ్బిల మేనన్ । పెంపున నలుగిడి నగా । విం పుచు
నలుగొప్ప వెట్టి వేడుక తోడన్ ॥౨౯౯॥ సీ॥ కస్తూరియును వచ్చకర్పూరమును
గోవజవ్వాదియును మంచిచందనంబు । పన్నీట పదనిచ్చి పంకంబుగాఁ జేసి
యందుల నటకలియ మర వెట్టి । గంగాజలంబులఁ గలయ మజ్జన మాచరించి
చవణాన్నంబు బడసి వైచి । దివ్యాంబరంబుల జేహంబు తడి యొత్తి కురులు
మున్ను గమ్మ కొప్పు వెట్టి । ధళధళ మను బహుపుష్పదామకములు । నెరయ
కబరీభరంబున నిండఁ దురిమి । నొసల కస్తూరి మదతిలకంబు పొసఁగ వెట్టి చెందమ
ణిదర్పణంబును జేతి కిచ్చి ॥౩౦౦॥ క॥ పాటీరగంధి కన్నులఁ । గాటుక నేరుపున
వెట్టి కనకమణి శ్రీ । తాటంకంబులు చెవుల । టాటోపంబుగ ధరించి రంచిత
లీలన్ ॥౩౦౧॥ గీ॥ చెలఁగి కట్టాణిముత్యాల చేరుచుక్క । పిత్రత్రైనసీమంత
వీథియందు నించి కోటుల దివ్యమాణిక్యమైన । ముక్కరప్పుడు నాసాగ్రమున నె
మర్చిరి ॥౩౦౨॥ సీ॥ వచ్చలఁ గడియాల పాణిపద్మంబులఁ గీలించి రత్నసంకీర్ణ
మైన । బలికేలు స్పృశకర్ణభాగంబులను వెట్టి తారహారములు నూతనములైన
పదకములు గళమున భాసురంబుగ వైచి భుజయుగంబున బాహుపురులు నించి
కటితటంబున రత్నకాంచిదామంబు జెలువొప్ప ధరియించి చిత్రలీల । నందె
లును వీరముద్రికెలందమైన । మెట్టెలును బెట్టి పిల్లాండ్లు మెరయఁబూన్చి । మే
నఁ గస్తూరిగంధంబు మిగుల నలఁది । వాసవాంగన కప్డు గైజేసి రెలమి ॥౩౦౩॥
వ॥ మఱియు ననేకభూషణంబులు దొడగిన వాసవకన్య చంద్రరేఖయుం బోలె
తేజరిల్లె నయ్యవసరంబున బాలనగరంబులు వసంతంబులు జేయించినయనంత
రంబ కుసుమాంగన యైన వాసవకన్య సెలయు వైసంగ వైశ్యకాంతలు నిజమంది
రంబుల కరిగి ॥౩౦౪॥ గీ॥ దివ్యబహుగంధగంధి దీప్యమైన । చందనంబులు మేను
లఁ జాలనలది । హల్లకాది ప్రసూనంబు లలరిత భంగి । నదరధమ్మిల్లములయందు

ముడిచిరంత॥ ౨౮౭॥ వ॥ మఱియు ననేకవిధంబులయిన యంబరంబులుగట్టి దివ్య
భూషణంబులు ధరియించి బాలనగరంబులఁ బిలుపించి వారల నాదరించి వసంతం
బులాడుటకై యుద్యోగించుటయు వారలు పసిండికొప్పెరలఁ బన్నీరు నానా
విధంబులఁ నియమించి వెండితొట్లలఁ గప్పురాకార తైలంబులును జాదు మొదలైనవ
స్తువులు వట్టించి మఱియును వసంతోచిత నానావిధ ద్రవ్యంబుల నేకంబులు
గాఁ గూర్చి చిమ్మనగోవులు మొదలైన యనేక చిత్రంబులు గూర్చి వసంతంబుల
కుఁ దఁడవి బాలనగరంబులఁ బిలుపించి రా నయ్యవసరంబున॥ ౨౮౮॥ శా॥ ఘాత్యాబా
దిమలక్ష్మవో లేసునమా సౌభాగ్యభాగ్యోదయం|బీక్షోత్రప్రభవించెనో క్షా
శుభనూత్నత్రేభంబు దానెక్కెనా|పీక్షింపాసను లెల్లభవ్యతురగాన్వితోత్తమా
రూఢులై|యక్షీణప్రభలుల్లసిల్లగమహావాంకారు లై వచ్చినన్॥ ౨౮౯॥ చ॥
కదలెఁ వాసవకన్యకామణిను హావాప్రశస్త్రప్రజ్వలత్కాశ్మరమ్యా|సుదతీసంఘ
ముఁగొల్వ మాగధజనస్తోత్రంబులే పారఁగా|విదితచ్ఛత్రపతాకచామరఘటా
విభ్రాజమానస్ఫుర|న్మదధారాభినవాను మోదనటనా ముంచామితానం
దమై॥ అప్పుడు ౨౯౦॥ సీ॥ కొమ్మకుంభంబులఁ బట్టిన పన్నీరు చిమ్మనగోవులఁ జి
మ్మువారు|ఘనచిత్రవేది కాకమనీయకర్పూరశిరములు వెదజల్లి జెలగువా
రు|మణిఘటన పూర్ణ మంజులకస్తూరికనాభిపంకంబు లూగి వేసెదగు వారు
బహుయంత్రదీర్ఘిక కాశరిపూర్ణచందన జలకేళియందందసలుపువారు
కుంకుమ ప్రసూనాగరుఘుస్మృణసురభి|వస్తునిచయంబుతగఁజల్లువారునగుచు
నవ్యకాంచాషణిగ్యాలనగవరులు|గొలువనేతెంచె వీధులకు వలయాక్షి॥
౨౯౧॥ సీ॥ అలరంగపంచమహాశబ్దములు మ్రోయ పిపిధభంగుల రాజవీధి
వేగి|రాజిల్లు నగరేశ్వరస్వామిఁ బూజించి తాత్పర్యమున జనార్దను భజించి|
వేడుకతోఁ జని వింధ్యవాసినిఁ గొల్చిఁ గడుభక్తితో నేకకాల కేగి|కొదవలే
కుండంగ కారణ నోములు నోచి ధారుణీసురలకు ధనము లొసగి|యిష్ట బంధుజ
నంబులకిప్పి శాఖల|సంచముముంచి బ్బుచు ఘూర్ణలఁ జాలదనిపి|తమ్ము నెప్పు డుద
యతో ఱందలవుననుచు|బాలనగరాలదీక్షించి బ్రబలగోరి॥ అంత॥ ౨౯౨॥

శా॥ అకన్యామణిఁ జూచి వైశ్యవరులత్యాశ్చర్యమున్ బొందుచున్ । లోకశ్లోక
శుభోక్తి నవ్యకరుణాలోలాత్ములై యుబ్బుచున్ । శ్రీకీర్తిస్థితిగా
నెదుకోని బహుశ్రీ వాహనారూఢులై । భూకంపంబుగ
వీథులన్ మెరయుచున్ పుష్పావళుల్ జల్లుచున్ ॥ ౨౫౧ ॥ చంపకమాల ॥
తరుణులు ప్రాణవల్లభులు దక్కన్ జూపరులుల్లసిల్లుచున్ * వరుసవసంత
ముల్ సలిపి వాసవకన్యక నిజనంబులు * సరసవచోవిలాసములసంభ్రమ
మొప్ప నను గ్రహించుచున్ । పరుడు గవింధ్య వాసినిలయంబున కేగెను దార
మూర్తియై ॥ ౨౫౨ ॥ సీ ॥ అత్యహో శక్తి కిననురక్తితో మొక్కి పితృపుర
స్సరముగా వినుత మహిమ * కోరి తనోములు నోమి కోమరొ దసఖులకుంద
ద్య్వతశుభపదార్థంబులొసంగి యిలబాలనగరాలపలుమారు దీవించి రవ్వ్రి
ద్ధినొంద నాశీర్వదించి * ప్రాణవయస్యలంబలుమారు వేవేరం బిలిచి కౌఁగి
టం జేర్చి ప్రియము జెప్పి * తొలగు బాష్పంబు ధారలు దుడిచి మగుసల * నూర
డించుచు సేవకులనొకరికోరి * నొప్పగించుచు నియుతితో నాదరించ * నెలయ
దీవించి మన్నించి వేడ్కలలర ॥ ౨౫౩ ॥ సీ ॥ శ్రీ జనార్దనమహాక్షేత్ర నగరేశు
లనతభక్తి పూజింపుడనుదినంబు । భాస్కర పండిత ప్రముఖపురోహిత విభులపా
లింపుడు వేడ్కలొడ * నారూఢిసలధర్మమైన మేనకయంబు తప్పక చేయుఁ
డుదారవృత్తి * నీ కతతో సుమదల్య సంప్రీతిగా నుత్సవంబులు చేయుఁడో
ప్పుమిగుల * పుణ్యమిదు జనసంగతి విడువవలయు * నిజకులాచారవర్తనన్నె
రపవలయు * ననుచు వాసవకన్యక యానతిచ్చి * జెలంగి వైశ్యుల నెల్ల నాశీ
ర్వదించె ॥ ౨౫౫ ॥ లయగ్రాహి । ఇందిరయుఁబోలె సుకరందజలభరితము
గుమందసురబిందములసాంద్ర జెలకుండన్ * పొందువడ వెంద్రుకలనటప ముగదు
రిమి జదుమందివిభవంబె పగదుందుభులు మ్రోయన్ * సందడిగ వాసవియు
మందగతిగదలె చెలులందరు భజింపఁ బెనుపొందసుభలెలన్ * వందిజనముల్
బొడగనుందగులు చెలఁగ సురబృందములు చేరిదివినొందిక దంజూడన్ ॥ ౨౫౬
వ ॥ అప్పుడు నానావిచిత్రచీనిచీనాంబరంబులు శుద్ధసువర్ణ ద్రవ్యంబులుని

వస్త్రంబులుపరిమళవస్తువిశేషంబులువజ్రవైడూర్యగోమేధికాదినవరత్నం
బులుచేతులఁగొలఁదిమీఱఁజల్లుచుసురభిద్రవ్యంబులవసంతంబులాడుచువింధ్య
వాసినిలయంబుచేరియమ్మహాశక్తికిషోడశోపచారంబులఁబూజలొనరించి క
దళీమూలస్థానమల్లికార్జునశ్రీనగరేశ్వరజనార్దనకోనకమలముగాది
పారదేవతానికాయంబులబహుమహోత్సవంబులబహువిధద్రవ్యంబులొసం
గివేదాంతవేత్తలైనవిప్రులకువిత్తదానంబులిచ్చిపెద్దలుకవిగాయకులుదీ
వించకులవృద్ధులైనవైశ్యసంఘంబులుగొలువపెనుగొండపురంబునంగలుగు
నాభాలగోపాలంబుఁజూడనేతేర బాలనగరంబులుపొంగుచుమహోత్సా
హంబునమెచ్చరించునట్టిసమయంబుననవ్వాసవకన్యామణిమొదలైన
వైశ్యసంఘంబులుభద్రదంతావళంబులనెక్కి వందిమాగధులుకైవారంబు
సేయవికసితవదనులై కదలిశ్రీనగరేశ్వరునిలయంబునకుఁబచ్చి మధ్యభాగంబు
నభద్రవేదికాస్థలంబుననవ్వాసవినిల్చిసింహపీఠంబునవీరాసనాసీనయై ని
జదివ్యదేహంబునంబ్రకాశమానంబగునట్లుగాకన్యాకుమారిశక్తిననుకరించి
దంష్ట్రాకరాళాట్టహాసంబులతోననేకాయుధంబులుధరియించి యవ్వాస
విహృదయకమలంబుప్రవేశించి సత్త్వగుణంబదునీవారసరీతుణంబుగల
ఫాలాక్షునిలలాటాగ్నినిజరూపంబుధరియించిప్రబలభయంకరాకారంబుఁ
జూపిసట్లువిష్ణువర్ధనభూపాలునిమృత్యుదేవతకనుపించినరీతి
మరియుశుంభనిశుంభచండముండరక్తబీజమధుకైటభులమీఁదభద్రకాళిక
సిమసంగినచందంబున శాత్రవులమీఁదరఘురాముఁడుచూచుచుండసీతామ
హాదేవికఁసినవిధంబునక్రవ్యాదులమీఁదకృష్ణుండుచూడసత్యభామరణంబు
నకుందొడరినదానివలెనవ్విష్ణువర్ధనమహారాజేంద్రుమీఁదనమ్మహావాస
వాంగనదివ్యదేహంబుననానేకాయుధహస్తులైశివమూతలుద్భవింపఁజూచివా
రందరుభయంకరులైయుండిరట్టిసమయంబునవాసవినలుదిక్కులువిమర్శించి
నమాత్రంబునవీరరసంబుప్పతిల్లకినుదమ్ములరుణకమలంబులైగనుపట్టెనట్టిస
మయంబునవాసవియిట్లనియె ॥ ౨౨౬ ॥ శా॥ కోపాటోపసమాహాగ్రమూర్తిన్

యగుచుఁ ఘోరాగ్ని వీక్షింపుచుఁ । పాపాత్ముండగు విష్ణువర్ధనమహీ
పాలుండు దుర్మార్గుఁడై । యీపుణ్యాత్ములకిట్లు జేసె నకటా యెబ్భంగి
ఖండింతునా । కాపూర్వాఘుఁడగు వానిమూర్ధము మహాకాలాగ్ని హో
మంబునన్ ॥ ౨౫౭ ॥ వ ॥ అనవితర్కించి రఘురామబాణసమానంబైన వా
క్యంబున నిట్లనియె ॥ ౨౫౮ ॥ ఉ ॥ యెప్పుడు కన్యయుఁ సతులు నీవణిగన్వయస
త్యసంధులుఁ । విప్రగు నగ్నిజ్వాలము ప్రవేశము సేయుట విన్నమాత్రనే । త
ప్పక రాజుమస్తకము ధాత్రితలంబునఁ బెస్కప్రయ్యలై । చెప్పవిచిత్రమై
ప్రమటసిద్ధమటంచు శపించెను గ్రతఁ ॥ ౨౫౯ ॥ వ ॥ మరియుఁ దదనంతరంబున
కులవృద్ధులైన వైశ్యులను భాస్కరాచార్యులను వేరువేర బిలిచి బాలనగరంబు
లకు భాస్కరాచార్యులనప్పగించి వారలవిలోకించి ప్రతిజ్ఞమీరనిట్లనియె ॥
౨౬౦ ॥ సీ ॥ మదగజాకృతితోడ మట్టిమల్లాడుమ పెనుగాలి నైవీతు పెరికిపోవ ।
బ్రహ్మరాక్షసినయి బాధింతు వాకిటవిడువక శూలినై మడియజూతు । కాళికా
రూప నైఖండించి చంపు మగంగనై మ్రింగుదు కసిమసంగి । గరుడినై మీఁది కెగరి
ననుపోరిగోండ్రఁగ్రుంకిన మొసలినై కుదియఁజూతు । సింహంబుచందమై చెండు
దు నఖములపులిరీతి దమిలేచి పొలియఁజూతు । వెలిగాడిపాము నైపిడుచకుం
డుదు నింటగుంపునై పెరుగుచు ఘట్టిగాను । మృత్యుపాశంబున మితలేక చం
పుదు జముడనై ప్రాణంబు సంహరింతు । నన్ను నట్టింటఁ బూజింపకున్న వారి ।
భాస్కరాచార్యవర్యులను ప్రతిదినంబు । గొలువకున్నట్టి నీచులకులము నంతు
ననుచుసోకలకుండచ త్రాతిమీద । పగుల త్రేయ ముముగులనాభటముతో
డ । నగ్ని చూచుచు మరియు నిట్లనుచుపలికె ॥ ౨౬౧ ॥ సీ ॥ మొదలి రాజులనెల్లమా
ర్యే కుమారులు తెగజూచి రేణుకాదేవిరీతి । ప్రతిభటపర్వతపతంబులగ
లించుతగు నింద్రశతకోటి ధారబోలి । తరిలేదిజీవుల దరియంగ నాటుకకసి
వోవదినుక ప్రశాళిరీతి । పటుతర బ్రహ్మాండభాండంబు లవియంగ మోదెడు
శితికంఠమూర్తిపగిది । మనుజపతిచేత జాజ్వల్యమానమగుచు । నోదవు సా
క్రోధవహ్ని కాహుతిగ జేతు । కులము వైశ్యులననుభక్తిగొలువకున్న । భా

స్కరాచార్యశిష్యుచేఁ బ్రబలకున్న ॥ ౨౭౨ ॥ సీ॥ అరచేతిమాణిక్యమైకోర్కెఁ
లీడేర్పఁ జిద్ధాంజనంబునై శిరులొసఁగఁ । బ్రాపుగఁ గట్టిన కామధేనువై ఫలి
యించు పెన్నిధానంబునై ప్రియము సేయ । కొంగుపసిండినై చెంగలింపఁగ చేతి
పెరటికల్పకమునై కరుణఁ గనుచు । వికట హేమాద్రినై నిలిచి యక్కరదీర్తు
పశుపుత్రపౌత్రులప్రబలఁ జూచు । సంతతంబును భాస్కరాచార్యులను
వందనోదారవినయసద్వర్తనలను । హితమొనర్చిన వైశ్యులకెల్లనుచు ।
కరుణఁ దీవించి వాసవకన్యకరియు ॥ ౨౭౩ ॥ సీ॥ చండతరోద్దండకాండధరోద
గ్రమూర్తినై కాలుకు మొదలుముట్ట । ప్రళయకాలకరాళపటుపావకోజ్జ్వ
లజ్వాలనై కాలుకు నేలఁగూల । గర్వదుర్వారోగ్రదర్వీకరస్వామి యా
కృతిగరళమున నణఁగిపోవ । జంభదానవమహాస్తంభకకర్కశలసద్దంభోళినై
ద్రుంచుతలలణఁగ । భాస్కరాచార్యవర్యుల ప్రతిదినంబు । నుచితపూజల
నలరింపకున్న వారి । నసుచు వైశ్యలనియమ్మిఁ జెనాగ్రహమున । కనుగొనిన
వారిమనముల కలకవార ॥ ౨౭౪ ॥ క॥ మండలమున మును భాస్కర । పండితు
లంగొలువనట్టి పాపాత్ములొగిన్ । చండాంశుడుగలకాలము । నుండు దురతి
ఘోరనరకభోజితులగుచున్ ॥ ౨౭౫ ॥ క॥ రాముని బాణము రక్షఃస్తోమంబుల
దప్పఁజూచి ద్రుంచినరీతిన్ । భీమంబైనా శాపము । తామసులగు వైశ్యవరుల
దాకెను నసుచున్ ॥ ౨౭౬ ॥ ఉ॥ ఇమ్మహిలో వణిక్కుల బహిష్కృతి వేచెడిక
ష్మ వారినిన్ । విస్మరులై యధర్మగతి జేరిన తూరుపువాటి గోవలన్ । నెమ్మమ
దీయ! శాపజటుస్ఫురపావకదగ్ధదేహులై । యిమ్మగ భ్రష్టులౌచు జగ మె
న్నఁగనుందురధర్మవృత్తులన్ ॥ ౨౭౭ ॥ క॥ దరువలుగోవలుధగలో । గరముగని
మూలమగుచు కడుదుష్టగతిన్ । దిరుగుచు చెడుదురు గాకని । సురుతరముగ
శాపమిచ్చె కుంభినియు ద్రుంచెన్ ॥ ౨౭౮ ॥ చ॥ కులమున బాయుకమ్మదొరగోవల
తూరుపునాటిదుష్టులన్ । గలశిభుజించి రేనితమకంబున వీయము లంది రేని
యున్ । బలుపిడిగోవధంబులును బ్రాహ్మణహత్య యుమద్యసేవయున్ ।
జెలగుచు మాంసభక్షణముఁ జేసినఁ బాపముఁ బొందు వారికిన్ ॥ ౨౭౯ ॥ గీ॥ మ

నసలాచారదూరుఁడైనుండఁబమున । చారిపోయినయానూటపదియారెం
డు। గోత్రముల వారువంశనికృష్టులనుచు । నుపనొక్కండువర్ధిల్లకుండ
వలయు ॥౨౭౦॥ వ॥ అనుచున వ్యాసవకన్యారత్నంబునాత్మజనంబులబంధువ
గణంబులనాజ్ఞాపించి శ్రీనగరేశ్వరభాస్కరాచార్య పండితాజ్ఞా ప్రతిపాల
నంబుఁజేయుండని బాలనగరంబులకుం దెల్పి వారలనాగురువునకొప్పగించి దే
వబ్రాహ్మణశ్రీపాదశుశ్రూషారాధకులైపుత్రమిత్రకళత్రపౌత్రులతోవర్ధిల్లు
దురుగాకయనిదీవించిమరియును ॥౨౭౧॥ చ॥ క్రముక ఘటంబుహస్తమునగ్ర
క్షునఁబట్టి మహోగ్రమూర్తియైసజ్జదగతింశిలాస్థలినశంకతవ్రక్కలు
గాఁగఁజేసినం। భరితము జెలంగధీరగతి పావకచంద్రసరోజమిత్రులుల్
క్రమముననిత్యసాక్షులనికన్నియపలైనుశాపవాక్యముల్ ॥౨౭౨॥ ఉ॥ వేద
పురాణయుక్తమయివిశ్రుతమైనవణిక్ప్రగాణసం । వాదముప్రవర్ణము
లవశ్యము జెప్ప గవింట మేలును । ఆర్యా దలెరుంగలేకకుటిలాత్ములువర్ణమ
బాంధవవృత్తిపూ । ద్రాదులఁ జెంతవిన్నకులహాని యగుం వసుధా స్థలంబు
నన్ ॥౨౭౩॥ గీ॥ విష్ణువర్ధనరాజుతో విగ్రహించి । చెలగి యగ్ని ప్రవేశంబు
చేసినట్టి । నూటయెనబండ్రుచరితంబునాత్మ భంగి ॥ విన్న వారికివంశాభి
వృద్ధియగును ॥౨౭౪॥ వ॥ అనిపలికి బ్రహ్మదేవునను ద్దేశించియిట్లనియె ॥౨౭౫॥
క॥ మాకులమునంమచక్కని । యానన్ని యపుట్టుకతన నిటుగావలసెన్ ।
లోకేశ యింత నుండియుఁ । జేకొని యిటువంటి సతుల స్పృజియింపకుమీ ॥
క॥ ఘనసుగుమణ్కలమునచక్కనికన్నియవలదుగుణముగలకాంతలుగా
జనియింపఁజేయుమీశ్వర । యని ప్రార్థనజేసె వాసవాంగనకణకన్ ॥
౨౭౬॥ వ॥ అనిపలికియాసిమ్హపీఠంబుననుండిడిగ్గనలేచియచ్చోటుగదలి
సాంద్రతరంబైనమ్మృగేంద్రనాదంబులఁ జెలంగుచువికటాట్టహాసంబుచేసిప్ర
స్ఫురితభుజాస్ఫాలనంబుచేసిసారెసారెకున్నిచ్చలవిడిగానుచ్చరంబులుపే
చ్ఛలింపయవ్యాసవాంగనవీరరసంబుప్పతిల్ల- మహాట్టహాసంబుచేసిహుం
కరించివికవికనవ్వి కేకలువేసి.పుట్టింటికిపోయిన తెరంగుననంగవలి యతిర

యంబునఁ జనిబహువిధాలంకారంబులైనతమతమగమకంబుల నెక్కి యాహార్యవీరప్రతులైనసపత్నీకులగు నైశ్వర్యవరులును - చండబలప్రచండులును - తమతమగమకంబులెక్కి యాహార్యవీరప్రతులై సాహసోల్లాసవీరావేశంబులప్రకాశితస్ఫారంభవిజృంభమాణులగుచున్నసమయంబున ॥౨౭౭॥ మ॥ కులభూభృన్నిచయంబు పెల్లగిలెదిక్కుంభీంద్రముల్ బెగ్గిలెఁ । గలఁగెన్ సప్తసముద్రముల్ బెదరెనత్రైశుద్ధాభీతిలెఁ । యిలపైఁ జూర్ణములై రాలెపక్షినివహం బేపారమ్రోసెన్ వడిఁ । గలయన్ ధాత్రివణంకె దేవగణముల్ కంపించెనయ్యాత్రలన్ ॥౨౭౮॥ వ॥ అంతవిఘ్నేశ్వర-నండి-నందినాథ-మహాకాళ-వీరభద్ర-విజయరుద్ర-ఘంటాకర్ణ-దారుకర్ణ ప్రముఖాఖ్యలైన - ప్రమథగణంబులును పరమభాగవతులును సేవింపలక్ష్మీసమేతుండై శ్రీమన్నారాయణుండును - నవబ్రహ్మాదిక్పాలరుద్రాదిత్యనవగ్రహవసుమునిగణంబులును - త్రయస్త్రింశత్కోటిదేవతలును - నాథాయత్త రక్షోపక్షిగరుడగంధర్వయక్షకిన్నరకింపురుషసిద్ధవిద్యాధరసాధ్యాదిసమస్తఖేచరులును తింపబ్రహ్మాయును - రంభయూర్వశీమేనకాతిలోత్తమాదిదివ్యసురకామినీనికాయంబులు విమానంబులనుండి నాట్యంబులు సలుప - నారదతుంబురులు వీణెలు ధరియించి గుండక్రియ రామక్రియ మొదలయిననరువదినాలుగు రాగభేదంబులఁ గానంబులు చేయ పార్వతీసమేతుండును నందివాహనారూఢుండును నాగపాశాంకుశడమరుఖడ్గవరదాభయకురంగాదిసాధనంబులు ధరియించివచ్చినభక్తవత్సలుండును - త్రినేత్రుండును జగదాధారుండును నగుసమస్తదేవర్షి బ్రహ్మర్షి - రాజర్షిగణసేవితుండును నైయనేకకోటిసూర్యజ్వాలాజ్వలత్ప్రభాభరితదిగంతరవ్యోమభూభాగుండును నైసదాశివుండు గగనమార్గంబున నిలిచి ప్రకాశింపుచుండె నయ్యవసరంబున ॥౨౭౯॥ క॥ ద్విత్రిహోరాత్రశతసంజ్ఞితపితృమహోద్దండచండవిభ్రమరేఖా । తతబహుళదహనదహన । స్మితకహకహారవములెసగమింటఁ బొలిచెఁ । శివగ్రహలయప్రాప్తి ॥ నం డె జేయు మిణుగురులు ఖండముల దుండములఁ గొండొరులఁ జెలగి శిఖమండలములు సృష్టిఁ । పాండుసుతదగపటు

ఖాండవవనోగ్రశిఖికుండలమహానియతకుండకనకోద్యత్కుండదివిషజ్జ్వలన
మండితసమగ్రభయదాండజకఠోరజలజాండరుచిదివ్యచ్చండిమఘనానల
ముపిండితదశదిక్కులనఖండగతిబొంగివడి మెండుకొనియుండెన్ ॥౨౮౨॥ క ॥ ఆ
కాల ప్రళయోజ్జ్వల । భీకరకరి నాగ్నిఁ జూచి బెదరకకనకన్ । జేకొనిధీరతత
ముగల । భాగంపింపంగ వాసవాంగనయంతన్ ॥౨౮౩॥ వ ॥ అనేకవిధంబులగుని
జకుండంబులమీఁదవీరసతీసహితులునిజవైశ్య కులంబులవారినెల్లనవలోకిం
చిచండబలప్రచండులుమనతోడగుండంబులం బ్రవేశించిరిమరియు వారలసం
తతీజనులకునెల్ల కాలంబును మీరలువర్తనఁజేసిరక్షింపుఁడనియానతిచ్చియ
నంతరంబ ॥౨౮౪॥ చ ॥ ఫెళఫెళనార్చికుండములఁ జేర్చినపుట్టలుమింట
నుండగా । వడిగ హేమపుష్పమణివర్ణములచ్ఛవిభంగి గురువగా । కడువ
డి దివ్య తూర్ణము ల్గ్రక్కున ప్రాయ మహానలంబులోఁ । దు
డయక ధీరవైశ్యవరకేతత్వరభంగి సురల్ నుతింపఁగాన్ ॥ ౨౮౫ ॥ శా ॥
హాహాకారములుల్లసిల్లనుమహాత్మాహంకారనిశ్శంకులై । బాహాటోపతనూట
యుపూర్ణరువడిన్ భార్యాసమాయుక్తులై । స్వాహాయంచనమశ్శివాయయ
నుచుం గాతాగ్నిలోఁ ద్రెళ్ళినన్ । మోహాపాయధ్యానములుల్లసిల్లదీపపద్మావళీ
హంబులుపొంగగాన్ ॥ ఆసమయంబున ॥౨౮౬॥ శా ॥ కులభూభృన్నిచయం
బు పెల్లగిలె దిక్కుంభీంద్రముల్బేదరెన్ । గలగెన్ సప్తసముద్రముల్ బెదరె
నతత్రైశుఁడుర్భీతుఁడై । యిలపై జుక్కలు వ్రాలెపక్షినివహంబేపారభ్రమో
న్నేన్ వడిన్ । గలయన్ ధాత్రి వడంకె దేవగణము ల్గంపించె నయ్యుగ్రతన్ ॥
౨౮౭ ॥ అప్పుడు ॥ చ ॥ అనలములెల్లనై జలములాశతకుండములన్ సమగ్రమై
ఘనకమలాకరాకృతులుగైకొనియుండెనఁ జూడవైశ్యులున్ । వసతలుచిత్ర
భంగితడివస్త్రములాయ్యెనగట్టుకొంచు వ । ధ్యానజనకేళిసల్పి రిమహావర
సంభ్రమలీలలుబ్బగాన్ ॥౨౮౮॥ వ ॥ ఇవ్విధంబుననగ్నికుండంబులన్నియు
నతిశీతలకమలాకరంబులై వడిచెలువుమిగిలియున్న తరినియన్మహాజలంబు
లమీఁదసమీరజనితతరంగంబులోనాయ్యె నొయ్యనబట్టినిచ్చుఖారునునై సపు

స్త్రజనంబులు వెగడందఁ జూపన వైశ్యులు పత్నీసమేతులై కుండంబులు వెలువడి
వచ్చి వైశ్వానరునకుఁ బెక్కు వందనంబులు చేసి యిట్లని వినుతించిరి ॥ ౮౯ ॥
కైవారగద్య। జయజయ హవ్యవాహన - జగత్త్రయసంసేవ్యమాన - చరణస
రసీరుహత్రితయ శోభితసప్తహస్త - చతుశ్శృంగసంగతప్రభావిజృంభణ
మస్తకద్వయవిరాజమాన - నమో వైశ్వానర తుభ్యం నమో దేవదేవ న
మస్తే నమస్తే నమః ॥ ౯౦ ॥ వ ॥ అని యనేకవిధంబుల నుతియించుచు పునః
పునఃప్రణామంబులు సేయుచు కరకమలంబులు మొగిచి యాచించి పేర్చిన నయ్య
గ్నిదేవుండు శరీరవాణి గానిట్లనియె ॥ ౯౧ ॥ ఉ ॥ మీ రతిపుణ్యవారిధులు
మిమ్ముఁ గారణమే హరింపఁగా। నేరక యున్న వాఁడ రజనీకరశేఖరభక్తి
యుక్తులై । చేరి శివాపవర్గసుఖసిద్ధి రహింపుఁడి కేని నాఁ జా। కారము జూ
డుఁ డంచు లయకాలదవాకృతి నిండి యుండినన్ ॥ ౯౨ ॥ వచనము ॥
సంతసిల్లి వైశ్యులు వైశ్వానరుం గనుంగొని యిట్లనిరి ॥ క ॥ భువనంబులనీ తేజము
నవిరళమహిమన్ జనించు ననవరతంబున్। దివిజముని లోకపూజిత। పవమాన
సఖుండ మమ్ముఁ బాలించు దయన్ ॥ ౯౩ ॥ వ ॥ అని యిట్లు నుతించి యుప్పొం
గుచు ॥ చ ॥ తడిసిన చీరలూడ్చి నెరి చాఁగని చీరలు గట్టి పుష్పమాల్। ముడిచిన వాం
గరాగగసముఖ్య సుగంధశరీరులై కడున్। వడి తమకంబు లెక్కఁ దెగి వాసవక
న్యయనూటయిఘ్నవృష్టి। దడయక తత్సతీసహితులు తత్పరమానసులై ను
హాగ్రతన్ ॥ ౯౪ ॥ క ॥ శివశివశివ యనిపలుకుచు। ప్రవిమలసద్భక్తి
నిలిచి పావకతతిలో। కువలయము వణకఁ జొచ్చిరి। దివిజులు వెరగంది పొగడ దిక్కు
లు బెదరన్ ॥ ౯౫ ॥ వ ॥ తత్సమయంబున ॥ మ ॥ సురసేవ్యా దైవతపుష్పవర్ష
ముమహోఘోషంబుతో మ్రోసెన్। బరవీథిన్ సురదుందుభిధ్వనులు లాగిన్ భ
గుండుకన్యామణుల్। నరవైశ్యాన్వయనాథులన్ సులలనా వైజ్యేంద్రస
ద్భృత్యులన్। వరుసన్ దోడ్కొని చెచ్చెరన్ మానవిసరావాహాఘ్యులన్ జేయు
చున్ ॥ ౯౬ ॥ శా ॥ కైలాసంబున కేగి వైశ్యజనముల్ కైవల్యపాదంబు
నన్ ఫాలాక్షుని దగ్గఱం గొల్చి నిల్చి రిసుఖభ్రాజిష్ణులై లీలతో। శ్రీలింపారగ

ధవుఁడనిరూపంబుదాల్చితన్నయువేడ్కన్ । సర్వజనంబులుజూడఁగ । గపర్వం
బునదివికి నేగెఁగౌస్తుభ మొదవన్ ॥ ౩౦౫॥ వ॥అంత పెనుగొండపురంబునం
దదవశిష్టవైశ్యశ్రేష్ఠులుబాలనగరంబులుపుణ్యాంగనలసుబాలికలునానా
జనంబులుశోకాతురులైయనేకవిధంబులపలవించుచున్నంజూచి భాస్కరా
చార్యుండుదుఃఖోపశమనంబులగు వాక్యంబులనిట్లనియె ॥౩౦౬॥ చ॥జ్వల
నముఖంబునన్నిలిచివైశ్యులుచేసినసాహసక్రియల్ ।జలరుహసంభవాదు
లకుశక్యముగానిపదంబుగల్గెనిదా । కులముపవిత్రమై వెలసెఁగుంభినియందు
నుకీర్తినిల్చె నుత్సూర్యాలకునుకర్మబంధములు త్రొవగరాదెటువంటివారి
కిన్ ॥ ౩౦౭ ॥ క॥జనములశోకదైన్యములుమానుఁడుబంధుకళత్రమిత్ర
నం। దనులునుభక్తితోఁబ్రతిదినంబునురక్షణమాచరింపుడిం ।కనుభవదీయ
మాతృజనకప్రియకార్యములౌర్ధ్వదైహికా।దిసుజకులోచితక్రియలుధీ
రతఁజేయుఁడుదింతలేటికిన్ ॥౩౦౮॥వ॥అనుచుబహువిధంబులబాలనగరం
బులనసూనయించినవారలుదుఃఖంబులుమానినిజగృహంబులకుజనిరితదనం
తరంబవారలచేత భాస్కరాచార్యులువిధ్యుక్తప్రకారంబులనుత్తరక్రియ
లుజేయించి శోకంబుడివి కాశీ గయాప్రయాగలకు దోడ్కొనిచని యి
చ్చటస్నానంబులుచేయించిమరియుభూమింగల యుత్తమతీర్థక్షేత్రంబుల
కుంగొనిచనియచ్చటచ్చటవారలచేతస్నానదానాదికృత్యంబులాచరింపం
జేసిపెనుగొండ పురంబునకుం దోడ్కొనివచ్చికన్యాశక్తిప్రతిష్ఠచేయించి
యనంతరంబతమపితృ నామాంకితంబులగు శివాలయంబులునిర్మింప నా
జ్ఞాపించితటాకంబులుకల్పితంబులుచేయించివనంబులునల్పించియఖండం
బులయినదీపంబులుపెట్టించిసప్తసంతానంబులుగావించితత్పుణ్యవిశేషంబు
వశ్రీనగరేశ్వరజనార్దనవాసవకన్యకాకృపావిశేషంబులతమయాశీర్వ
చనంబులనుపుత్రపౌత్రాభివృద్ధియగునట్లుదీవించిరియనంతరంబతత్ప్రాకా
రంబుననుఖులైమీవారలందరునూటయిబ్బందునగరస్వాములుతమతమ
పితృమాతృప్రీతికరంబులగుపనులనడిపించుచుబహువిధంబులగుద్రవ్యంబు

లువిప్రకవిగాయక దీనజనులకు నొసంగుచు సకలవ్రతంబులాచరించుచు
సంతతవిరహితంబగునొక్క గోత్రంబుద్ధతక్కిననూటొక్క గోత్రంబుల
వారలుసుఖంబుండిరని సాలంకాయనముని యానతిచ్చె నవినియమ్మహాత్మున
కుదండప్రణామంబులాచరించి వైశ్యఋషులు నిజాశ్రమంబులకుబోయిరని
చెప్పి శిష్యసమేతుండై నైమిశారణ్యంబునకుంజని యామునీపుణ్యకథవినిన వైశ్యు
లకునుత్తరోత్తరాభివృద్ధియగు నిదివినుటకు క్రమవిధానంబు వివరించెద నెట్లని
నపురాణ ప్రారంభకాలంబున శక్త్యనుసరణంబుగా బ్రాహ్మణభోజనం
బుచేయించి పురాణజ్ఞునకు నొక్కయుచితాసనంబిచ్చి కూర్చుండనియోగిం
చి వైశ్యజనులందరును వచ్చి పురాణజ్ఞునకు వందనంబాచరించి భక్తివిశ్వాసయు
క్తులై శ్రద్ధచే వినుటకు కూర్చుండవలయు. పురాణపుస్తకంబునకు మొదట
రెండుఖండంబులు కల్పించి ధూపదీపనైవేద్యంబులనర్పించి పురాణంబు ప్ర
మించవలయు. పురాణంబు శ్రవణానంతరంబున పునధూపదీపనైవేద్య తాం
బూలాదులం బూజించి పుస్తకంబు కట్టవలయునని క్రమంబీక్రమంబున జదువ
కవినక దుర్మార్గంబున విధిరహితంబుగా నాచరించిన జనంబులకు పురాణశ్ర
వణఫలంబులభించక పాపాత్ములగుదురు యిదియునుంగాక శాంతిచేయుస్థ
ళంబులువినుండు పార్వతీపరమేశ్వరవివాహంబును - వైశ్యులుపురప్రవే
శంబుచేయుసమయంబునను - వాసవాంగనాజననంబును. గోత్రసంకేతలిఖి
తకాలంబునను - శాంతిగావలయు - దంపతిపూజయు చేయవలయు - గుండప్ర
వేశంబునకు చేయవలశిన శాంతివినుండు వైశ్యులెందరుగలరో యందరుగృ
హమర్యాదప్రకారంబున వాయనదానంబును - దంపతిపూజయు గోదానం
బును బ్రాహ్మణభోజనంబు విశేషించి జేయవలయు - పురాణశ్రవణానంత
రంబున యథాశక్తి బ్రాహ్మణభోజనంబును పురాణజ్ఞునకు దివ్యవస్త్రమాల్యా
దులచే పూజించి యథాశక్తి సువర్ణపుష్పంబులొసంగి ఫలతాం దక్షిణలు
గైకొని పురాణంబు శాంతిపూరించవలయు నీక్రమంబున జరుపవలయు నిదిపు
రాణశ్రవణక్రమము బుధీనిచే వైశ్యులకు సకలసంపత్సమృద్ధియు పుత్రపౌత్రాభి
వృద్ధియును గంగాదిసమస్తనదీస్నానపుణ్యంబుగలిగి వాసవాంబికాకటా
క్షంబున సుఖంబుండుదురని నవనిసంతతసిల్లిబాలనగరంబులు తత్క్షణంబున

నిలిపిరని చెప్పె ॥ ఉ ॥ కేకయ మాళవ ద్రవిళ కేరళ గూర్జర ముఖ్య
పట్టణ ప్రాకట కీర్తివర్ధనులు బాంధవ జనావన పాకశాసనానోకహముల్ మహో
మతులనూనకృపాకరు లిందుశేఖర శ్రీకర విష్ణుపాదసరసీరుహభృంగము
లూనసంభవులు ॥ మాలిని ॥ కలశ జలధికన్యా కాంతపాదాబ్జలిప్తా । మలయజ
ఘనవంశోన్మగ్న ఫాలస్థరేఖా । విలసితఘనచిహ్నావిష్కృతుల్ నిష్కళంకో
జ్జ్వలవగమనసాంఖ్యల్ శాంతులీ వైశ్యులుర్విన్ ॥ హంసపదవృత్తం ॥ వందనాగ
తామరేంద్ర బృందచారువర్ణనా । నందపూర్ణహాసపాజ్ఞనవ్యభవ్య విక్ర
మా । కుందచంద్రికా ప్రకాశకోమలాంగశోభితా । నందివాహనాదికూఢనా
గభూషణోజ్జ్వలా ॥ పనసమయూఖపిరాజితవృత్తం ॥ పంకజలోచనపద్మజశక్ర
శుభప్రదనూతనపద్మపదా । శంకరశర్వలసద్ఘనచంద్రశశాంకవృషధ్వజ
చారునటా । కింకరరక్షణకేళికళాకలకేళివిలాససుకీర్తిధరా । న్యంచధరా
మరనారదముఖ్య వినాయక వందితదివ్యపదా ..............................

*గద్య*

ఇది శ్రీ సరస్వతీకళాసచరణసరసీరుహాభిష్యందనమకరందబిందుసందోహ
మధురసాస్వాదక రాయహూనమానససరసకపిత్తాకిలాస శ్రీసురభాస్కరా
చార్యప్రణీతంబైన వైశ్యపురాణంబను పేరవిలసిల్లు కన్యకాచరిత్రంబను మ
హాప్రబంధంబునందు వైశ్యులు రాజు చేసిన కార్యంబు వినుటయు - వచ్చిన రాజ
దూతలకుని వాసంబులుగల్పించి వారాంగనాలోలులౌనట్టుగా జేయుటయును -
పెంబామునుండ ప్రవేశంబు చేయుటకు నిశ్చయించి గ్రామంబున చాటంబంచుట
యును - ఆ వార్త విని ఆనాటవస్ని ధర్మపలాయితులగుటయు । తక్కిన సన్నా
టయుబ్బ గ్రుడ్డ వీరకంకణతాంబూలంబులందుటయు । నిజగోత్రలిఖితంబులు
భాస్కరాచార్య దానపత్ర క్రమంబును బాలనగరంబులకు వైశ్యులు కులధ
ర్మంబులు సూచించుటయు వాసవకన్యకా సమాధానంబును పురశృంగారం
బును వీరవసంతంబులాడుటయు గుండ ప్రవేశంబును విష్ణువర్ధనుమరణంబు
నుపురాణశ్రవణక్రమసంవిధానంబును బాలనగరంబులు సుఖంబుం
డుటయు ననుకథలంగలసీ మహాప్రబంధంబునందు సర్వం
బును అష్టమాశ్వాసము సంపూర్ణము.

